| | | |
|---|---|---|
| ఓం శ్వేతద్వీపసువాస్తవ్యాయ నమః | ఓం వేదాత్మనే నమః | ఓం బుద్ధావతారాయ నమః |
| ఓం సూర్యమండల మధ్యగాయ నమః | ఓం బాదరాయణాయ నమః | ఓం శాన్తాత్మనే నమః |
| ఓం సనకాదిముని ధ్యేయాయ నమః | ఓం భాగీరథీ జన్మభూమి పాదపద్మాయ నమః | ఓం లీలామానుషవిగ్రహాయ నమః |
| ఓం భగవతే నమః | ఓం సతాంప్రభవే నమః | ఓం దామోదరాయ నమః |
| ఓం శంకరప్రియాయ నమః | ఓం స్వభువే నమః | ఓం విరాడ్రూపాయ నమః |
| ఓం నీళాకాన్తాయ నమః | ఓం ఘనశ్యామాయ నమః | ఓం భూతభవ్యభవత్ప్రభవే నమః |
| ఓం ధరాకాన్తాయ నమః | ఓం జగత్కారణాయ నమః | ఓం ఆదిదేవాయ నమః |
| | ఓం అవ్యయాయ నమః | ఓం దేవదేవాయ నమః |
| | | ఓం ప్రహ్లాదపరిపాలకాయ నమః |

శ్రీ విష్ణు అష్టోత్తర శతనామావళి సంపూర్ణం



# క్షీరాబ్ధి శయన వ్రతం



క్షీరసాగరమున శయనించు శ్రీ మహావిష్ణువు ద్వాదశి రోజున బృందావనమునకు విచ్చేయును ఆరోజున శ్రీమహావిష్ణువును బృందావనమున శ్రద్ధగా పూజించిన వారికి ఆయురారోగ్య సిరులు కలుగును. ద్వాదశిరోజున సాయత్రం సూర్యాస్తమయ సమయమున పూజలు ధానధర్మాలు చేసినచో అత్యధిక ఫలితం ప్రాప్తిస్తుంది. సముద్రము నుండి వచ్చిన శ్రీమన్నారాయణుడు లక్ష్మీ సమేతమున ఎచ్చట ఉండునో అబృందావన క్షేత్రమునందు ఎవరైతే తులసీ సమేతముగా పూజించెదరో వారి సమస్తపాపములు నశించి శ్రీహరిసాన్నిధ్యాన్ని పొందుదురు. యక్షగంధర్వనారదాది ఋషులు మునులు బృందావనం లో ఉన్న శ్రీహరిని సదా పూజించుచుందురు.

పతితుడు,శూద్రుడు మహాపాతకములు చేసిన వాడు బృందావన శ్రీహరిని ద్వాదశి రోజున ఆరాధించిన వారిసమస్త దోషములు తొలగి పుణ్యలోకములు పొందుదురు. ఎవరైతే స్వామిని ఆరోజున ఆరాధించరో అట్టివారిపుణ్యములు పోయి నరకమును అనుభవించెదరు. కనుక బృందావనమున చేయు శ్రీహరి పూజా మహిమ విష్ణువునకు అత్యంత సంతోషకరము. కార్తీక శుద్దద్వాదశి యందు శ్రీహరిని ఆరాదించనివాడు కోటి జన్మలు పాపియై పుట్టును. బృందావనమున శ్రీహరిని కార్తీక శుద్ధ ద్వాదశినాడు పూజించిన వారి బ్రహ్మహత్యాదోషం సువర్ణాపహరణ దోషము, సురపాన దోషముగురు తల్పమును ఆధిరోహించినదోషము వంటికోటి దోషములైను అగ్నియందు పడ్డదూదివలె హరించిపోవును. తులసీ బృందావనసన్నిధాన అరాధన శ్రీహరికి ప్రీతిదాయకము.

పూజనిమిత్తం ముగ్గులు వెయ్యాలి. శంఖ, చక్ర గదా, కౌముది, గోవుపాదాదులు, ఆతిన్నె మీద ముగ్గులు వేసి అలంకరించాలి. గీతవాయిద్యాలు వేధఘోషలు వినిపించాలి. లక్ష్మీనారాయణుని తులసీ సమేతంగా పీఠంపై ప్రతిష్ఠించి పంచామృత స్నానం చేయంచాలి. వస్త్రాభరణాదులతో అలంకరించాలి. దీపారాధన చెయ్యాలి. పుష్పాలతో పూజించాలి. నైవేధ్యాన్ని నివేదించాలి. తాంబూలం సమర్పించాలి. శ్రద్ధా భక్తులతో

ఆరాధించినవారికి సమస్తాభివృద్ధులు జయం కలిగి సుఖంగా జీవించెదరు.

ఎవరైనను తులసి వ్రతమును చేయజాలనివాడు బ్రాహ్మణ సభలో తులసి మహత్యమును వినవలెను. తులసి కథను విన్నవారికి విష్ణులోకము ప్రాప్తించును. పూజాకాలమున దూపదీప నైవేద్యాదులు చూచిన వారికి గంగానదీ స్నానము చేసిన ఫలితము సమకూరును. నీరాజనమునుచూచిన కళ్ళకు శిరస్సుకు అద్దుకున్న విష్ణువును పూజించిన ఫలితముకలుగును. పూజానంతరం కొబ్బరికాయ కొట్టి బెల్లం, ఖర్జూరం, అరటిపళ్ళు చెరకును నివేదించవలెను. నైవేద్యము సమర్పించి మంత్రాక్షతలు తీసుకొనవలెను. అనంతరం బ్రహ్మణాశీర్వచనము పొందవలెను.

ద్వాదశి నాడు బృందావనమున దీపదానముచేయవలెను. ఉపపాతకములు నశిస్తాయి. పదిదీపాలుదానంచేస్తే శివసాయుజ్యం లభిస్తుంది. అంతకన్నా ఎక్కువదీపాలు దానం చేసిన వారికి స్వర్గాధిపత్యం లభిస్తుంది. దీప దర్శన ప్రదర్శనమువల్ల ఆయుష్య, బుద్ధి బలము, ధైర్యము, సంపదలు, పూర్వజన్మ స్వరణ సిద్దిస్తాయి.

దీపానికి ఆవునెయ్యి వాడవలెను. అది సాధ్యపడనిచో మంచినూనెవాడడం మధ్యమము. ఇప్పనూనె తదితర నూనెలుఅధమం.

దీపం వెలిగించి దానం చేస్తే జ్ఞానలాభం కలుగుతుంది.

దీపారాధనకై మంచినూనె దానమైతే సంపద కీర్తి సిద్దిస్తుంది.

ఇప్పనూనె దీపం ఇహభోగములు కలుగుతాయి.

వనతైలమువలన కామ్యార్ధాములు సిద్దిస్తాయి.

అవ-అవిశనూనెలదీపములు శతృజయం కలిగిస్తాయి.

ఆముదముదీపమైన అయుష్య సంపద నశించును

గేదెనెయ్యి దీపమైన పూర్వపుణ్యము నశించును

గేదె నెయ్యిలో కాస్తఆవునేతిని కలిపి పెట్టిన దోషముండబోదు

ఏక వత్తి దీపం దానం చేసిన సమస్త పాపాలుతొలగి బుద్ధి, తేజస్సు కలుగును.

నాలుగువత్తులు దీపమైన రాజుగును

పదివత్తులు దీపమైన చక్రవర్తి అగును

యాభైవత్తుల దీపమైన దేవతలలో ఒకరగును.

నూరువత్తులు దీపమైన విష్ణుసాన్నిధ్యం కలుగును

వేయివత్తుల దీపమైన సాక్షాద్విశ్వరూపుడుగును.

ఈ ఫలితము విష్ణుక్షేత్రమునతులసి సన్నిధినిచేసిన ఫలితము రెట్టింపగును.

గంగాతీరమున చేసిన మూడింతలగును, కార్తీకద్వాదశినాడువిష్ణుసన్నిధిన నాల్గింత లగును, బృందావనసన్నిధియందు విష్ణుపూజ చేసినవారికి ఉత్తమగతులు కలుగును. భక్తితో పూజ చేసినవారు. పూజ, ఫల పుష్పాది నైవేద్యము దీపారాధన చూచి ఆనందించువారు ఆయురారోగ్య ఐశ్వర్యములు పొంది పరమ పదము పొందుదురు.

# తులసి మహాత్మ్యం

తులసి వ్రతము ఆమోఘమైన ఫలితాన్ని కలిగించు దివ్యవ్రతము తులసిదళమునందు పుష్కర తీర్థము గంగానది అని పుణ్యనదుల పవిత్ర ఉదకాలు. శ్రీమన్నారాయణుడు సమస్తమైన దేవతలు నివశిస్తుంటారు. ఘోరపాపములుఎన్ని చేసినవాడైనా తులసి మృత్తికను పూసుకుని చనిపోయినచో వానిని దూరం నుండి కూడా యమదూతలు చూడజాలరు. కేశవుడ్నిగాని శివుడినిగాని తులసి గుత్తులతో పూజించినచో పునర్జన్మకలుగదు. కార్తీకమాసంలో లక్షతులసీదళ వ్రతమును అచరించి శ్రీహరిని పూజించువారికి సమస్త సంపదలు సమకూరును. తులసిని స్థాపించుట వలన స్పృశించుటవలన, పెంచినందువలన తులసిని గూర్చి చదివిన, తెలుసుకున్నా మనోవాక్కాయ కర్మలచే ఆచరించినసకలపాపములు హరిస్తాయి.

నర్మాదానదిని చూడడం,గంగానదిలోస్నానం చేయడం, తులసీవనాన్ని సేవించడం ఈ మూడు పనులు సమాన ఫలితాన్ని కలుగచేస్తాయి. తులసివనాన్ని స్థాపించు వారి సమస్త పాపాలు హరించును. ఇష్టకామ్యసిద్ధి కలుగుతుంది. యమునివల్ల భీతి కలుగదు.

యజ్ఞాలు, యాగాలు, పూజలు, వ్రతాలు, సమస్తం కార్తీక మాసంలో చేయుట వలన రెట్టించిన పుణ్యాన్ని కలుగజేస్తాయి. తీర్థయాత్రలు దేహాన్ని మనస్సును పునీతం చేస్తాయి. వీటి వల్ల కలుగు పుణ్యఫలం అనంతం.

కార్తీకమాసమునందు ఉసిరికపత్రి, ద్వాదశితిధియందు తులసిదళమునుకోయని వారు, వాటితో పూజలు చేయనివారు చేయుపనులు నిరర్ధకములు, నిష్ఫలములు, అట్టి అజ్ఞానులు ఘోరనరకములపాలగుదురు.

తులసి దర్శనము కలుగనివారు ఆసమయమునకు విష్ణు భక్తుని పూజించవలెను. అట్లొనర్చుట ప్రదమమగును. నారాయణ సన్నిహితుడగు భక్తుడు విప్రుడు శ్రీమన్నారాయణాంశ సంభూతులగుటవలన వారిని పూజించుట పుణ్యప్రదము.

తులసి మాలగాని దాత్రి మాల (అనగా ఉసిరి మాలను) గాని ధరించుట శ్రేష్టము. అట్టి వారు కొన్ని వేల కోట్ల సంవత్సరములు స్వర్గమునందు నివశించెదరు. ఈ మాలలను దానం చేసినా ధరించతలచిన తులసి దేవిని శ్రీహరిని స్మరించవలెను. సమస్త పుణ్యాలను కలగజేసి, సర్వపాపాలని హరించును ఈ తులసీదళం.